



ఒక రాజు దగ్గర ముగ్గురు సేవకులు ఉండేవాళ్లు – వాళ్లల్లో ఒకరు వేటగాడు, ఒకరు చౌకీదారు, ఒకరు పిండి మర ఆడించేవాడు.

పిండి మర ఆడించే
వ్యక్తికి రాహెల్ అన్న
ఒక కూతురు ఉంది.
ఆమె చాలా
తెలివైనది,
అందమైనది.
అయితే ఆమె పిండి
మరలో ప్రతి రోజూ
ఎంతో కష్టపడి పని
చేయాల్సి వచ్చేది.





ఒక రోజు రాజు ఆ ముగ్గురు సేవకులను పిలిచి ఇలా చెప్పాడు, “మూడు చిక్కు ప్రశ్నలకు సమాధానం కోసం మిమ్మల్ని పిలిపించాను. సరైన సమాధానం చెప్పిన వాళ్లకు బంగారు నాణాల సంచిని ఇస్తాను. సమాధానం చెప్పలేక పోయిన వాళ్లు దేశం విడిచి పోవాలి. కాబట్టి ప్రశ్నలు జాగ్రత్తగా వినండి:

ప్రపంచంలో అన్నింటికంటే వేగమైనది ఏది?

ప్రపంచంలో అన్నింటికంటే లావైనది ఏది?

ప్రపంచంలో అన్నింటికంటే ప్రియమైనది ఏది?

ఈ ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వటానికి మీకు మూడు రోజుల సమయం ఇస్తున్నాను."

దీని గురించి మాట్లాడుకోటానికి వేటగాడు, చౌకీదారు అడవి లోకి వెళ్లారు.

“సమాధానాలు నాకు తెలుసు!" చౌకీదారు అన్నాడు. “ప్రపంచంలో అన్నింటికంటే వేగవంతమైనది రాజుగారి గుర్రం; ప్రపంచంలో అన్నింటికంటే లావైనది రాజుగారి పంది!"

“ప్రపంచంలో అన్నింటికంటే ప్రియమైనది రాజుగారి తల్లి!" వేటగాడు అన్నాడు.

తమ తెలివికి మురిసిపోతూ వాళ్లిద్దరూ నాట్యం చేశారు.





పిండి మర ఆడే వ్యక్తికి
ఒక్క ప్రశ్నకి కూడా
సమాధానం దొరకలేదు.
అతడు విచారంగా ఇంటికి
నడుచుకుంటూ వెళ్లాడు.
అతడు ఇంటికి చేరుకున్న
తరవాత రాహెల్ అన్నం
పెట్టింది.
“నాన్న, మీరు విచారంగా
ఉన్నారేమిటి? ఏ విషయం
మిమ్మల్ని బాధిస్తోంది?"
రాహెల్ అడిగింది.







“నేను పెద్ద సమస్యలో చిక్కుకున్నాను, అమ్మాయి," అంటూ
అతడు రాజుగారు అడిగిన మూడు ప్రశ్నలు చెప్పాడు.
“అంతే కదా, నాన్నగారు. ఈ ప్రశ్నలు చాలా తేలికైనవి!" అంటూ
రాహెల్ ఆ మూడు ప్రశ్నలకు అతడి చెవిలో సమాధానాలు
చెప్పింది.

అప్పుడు రాహెల్
కొవ్వొత్తులు
వెలిగించింది.



ఆహారం ఇచ్చినందుకు
దేవుడికి తండ్రి
కృతజ్ఞతలు తెలిపాడు.
తరవాత తండ్రీ,
కూతుళ్లు భోజనం
చేశారు.



మూడు రోజుల తరవాత ముగ్గురు సేవకులు రాజుగారి దగ్గరకు వెళ్లారు.

“రాజా, ప్రపంచంలో అన్నింటికంటే వేగవంతమైనది మీ గుర్రం. ప్రపంచంలో అన్నింటికంటే లావైనది మీ పంది. ప్రపంచంలో అన్నింటికంటే ప్రియమైనది మీ తల్లిగారు,” అని వేటగాడు, చౌకీదారు చెప్పారు.

ఆ సమాధానాలను రాజు శ్రద్ధగా విన్నాడు.







“తప్పు!" రాజు అన్నాడు. “మీరిద్దరూ దేశం విడిచి వెళ్లండి. మళ్లీ ఎన్నడూ తిరిగి రావద్దు!" వేటగాడు, చౌకీదారు విచారంగా అక్కడినుంచి వెళ్లిపోయారు. ఆ తరవాత పిండి మర ఆడించే వ్యక్తి వంతు వచ్చింది. అతడు గట్టిగా ఊపిరి తీసుకుని ఇలా సమాధానం చెప్పాడు, “రాజా, ప్రపంచంలో అన్నింటికంటే వేగవంతమైనది ఆలోచన, లావైనది పృథ్వి, ప్రియమైనది నిద్ర."







ఆ సమాధానాలు విని రాజు ఆశ్చర్యపోయాడు. “నీ బంగారు నాణాల సంచి ఇదిగో!" అన్నాడు రాజు. “ఈ సమాధానాలు నువ్వే కనుక్కున్నావంటే నమ్మ బుద్ధి కావటం లేదు. నిజం చెప్పు. ఈ సమాధానాలు నీకు ఎవ్వరు చెప్పారు?"

పిండి మర ఆడించే వ్యక్తి చాలా భయపడి పోయి రాజుకి నిజం చెప్పాడు, “మహారాజా, నా కూతురు రాహెల్ ఈ ప్రశ్నలకి సమాధానం చెప్పింది."

“అలాగా! నీ కూతురు చాలా తెలివైనది లాగా ఉంది," రాజు అన్నాడు. “ఆమెను కలవాలని ఉంది, రాచమహలుకు రమ్మను.
అయితే ఆమె మహలుకి వచ్చినప్పుడు బట్టలు వేసుకుని ఉండకూడదు, విప్పి ఉండకూడదు.
ఆమె నడిచి రాకూడదు, దేనిమీదా సవారీ చేసి రాకూడదు. ఆమె నాకు బహుమతి ఇవ్వాలి, కానీ బహుమతి ఇవ్వకూడదు. ఇందుకు
మూడు రోజుల సమయం ఇస్తున్నాను. ఆలోగా ఇలా చెయ్యలేకపోతే మీరు దేశం విడిచి వెళ్లాలి!"







దాంతో పిండిమర ఆడించే వ్యక్తి విచారంగా ఇంటికి చేరుకున్నాడు. అతడిని అలా చూసిన కూతురు, "నాన్నా, మీరు ఇంత విచారంగా ఎందుకు ఉన్నారు?" అని అడిగింది. రాజు చెప్పిన కొత్త విషయాన్ని కూతురికి చెప్పాడు. అప్పుడు రాహెల్, "నాన్నా, ఇవి చాలా తేలికైన షరతులు.





మీరు నాకు డబ్బులు ఇచ్చి, బజారుకి వెళ్లనివ్వండి, చాలు," అంది. బజారులో రాహెల్ చేపలు పట్టే ఒక వల, ఒక మేకపోతు, రెండు పావురాళ్లను కొనక్కుని వచ్చింది.

మూడవ రోజున రాజుని కలవటానికి రాహెల్ బయలుదేరింది.

రాహెల్ తన బట్టలు తీసేసి చేపలు పట్టే వలను కప్పుకుంది – ఆ విధంగా ఆమె బట్టలు వేసుకుని లేదు, నగ్నంగా లేదు.

తరవాత రాహెల్ మేకపోతును ఎక్కి బయలుదేరింది. అయితే ఆమె కాళ్లను నేల మీద ఈడుస్తూ ఉంది. ఆ విధంగా ఆమె నడిచి రావటం లేదు, దేనిమీదా సవారీ చేసి రావటం లేదు.

చివరిగా ఆమె మహలులోకి ప్రవేశించగానే తన చేతులో ఉన్న పావురాళ్లను రాజుకి చూపిస్తూ, “మీ కోసం బహుమతి తెచ్చాను,” అంటూ వాటిని ఇచ్చింది. ఆ పావురాళ్లు రెండూ వెంటనే పైకి ఎగిరిపోయాయి. ఆ విధంగా ఆమె రాజుకి బహుమతి ఇచ్చింది, దానిని ఇవ్వలేదు కూడా.

రాహెల్ చాలా తెలివైనదని రాజు గ్రహించాడు.

రాజ్యాన్ని నడపటంలో ఆమె సలహాలు కావాలని రాజు ఆమెని అడిగాడు.






ఆ విధంగా పిండి మర ఆడించే వ్యక్తి కూతురైన రాహెల్ రాజుకి ముఖ్య సలహాదారు అయ్యింది. ఆ తరవాత ఆమె పిండి ఆడే పని చెయ్యాల్సిన అవసరం రాలేదు.
24

**అయిపోయింది**